

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీనిగమాంత దేసికాయనమః

# దేవనాయకపంచాశత్



దేవనాయకస్వామి, తిరువహీంద్రపురం



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్రగ శింగరాచార్యులు

సమర్పణ: మొలుగు వేంకటాచార్య, తిరుచానూరు

వంగల వేంకట కేశవ అయ్యంగారు

# దేవనాయకపంచాశత్

అవతారిక:

తిరువహీంద్రపురమనే దివ్యదేశంలోని దివ్యాలయంలో వేంచేసి ఉండే దేవనాయకస్వామిని కీర్తిస్తూ రచింపబడిన ఈ స్తుతిలో 50శ్లోకాలున్నందున దీనికీ పేరు కలిగింది. ఈ స్వామికి "అడియవర్కు మెయ్యన్" అని ద్రావిభాషలో పేరు. దేశికులకు ఈ స్వామివిషయంలో గల భక్తి చాలా గొప్పది. అందువల్ల వారు చాలా కాలం ఈ క్షేత్రంలో నివసించి, ఈ స్వామిని సేవించారు. ఈ ఊరిలో దేశికుల గృహం. వారు స్వయంగా తవ్విన బావి ఇప్పటికీ ఉన్నాయి.

దేవనాయకస్వామి దివ్యసౌందర్యంలో తమకు గల అభినివేశాన్ని వ్యక్తం చేస్తూ, దేశికులీ అద్భుతస్తోత్రాన్ని రచించారు. ఇందులో, మొదట దేవనాయకస్వామి దేవాధిదేవుడని పలికి, క్రమంగా ఆచార్యపరంపరను, వాల్మీకిమహర్షి మొదలైనవారిని నమస్కరించి, లక్ష్మిని ప్రార్థించి, ఈ స్తుతిని రచించడంలో తమకుండే యోగ్యతనుగూర్చి పలికి, దీనిని పూర్తి అయేటట్లు చేయడం ఆ భగవానుని బాధ్యత అని, తమకు ఈ స్తుతిని రచించడానికి తగిన వాక్ శక్తిని ప్రసాదించమని అర్థించి పూర్వం తనకు దూరంగా ఉండే తమను స్వామియే తన కరుణతో బలవంతంగా తనవద్దకు ఆకర్షించాడని తెలిపారు. తరువాత, దేవనాయకస్వామిపట్ల తాము అభినివేశాన్ని పొందిన తరువాతనే తమ మనస్సుకు విశ్రాంతి కలిగిందని పలికి, భగవానుడుండే చోట్లనుగూర్చి పలికి, ఈ క్షేత్రంలో ఉండే పుణ్యతీర్థాలను తెలిపారు. తరువాత, జన్మ అనే వ్యాధిని తీర్చే గొప్ప మందైన స్వామి నెలకొని ఉండడంవల్లనే

ఇక్కడి పర్వతానికి ఔషధాద్రి అనే పేరు వచ్చిందన్నారు. ఈ స్వామిని కొలిచేవారు అతనివలె దైవత్వాన్ని పొందుతారని తెలిపి, చేతనాచేతనతత్త్వాలన్నీ ఇతనికి దివ్యాయుధాలుగా, దివ్యాభరణాలుగా ఉన్నాయన్నారు. తరువాత, ఈ స్వామి దివ్యసౌందర్యాన్ని విస్తృతంగా వర్ణించారు. ఒక్కొక్క దివ్యాంగంలోని అందాన్ని దర్శించి, వ్యామోహాన్ని పొందారు. కిరీటంనుండి పాదాలవరకు గల ఒక్కొక్క అవయవాన్ని ముప్పై శ్లోకాలలో వర్ణించారు. కిరీటం, కేశపాశం, ముఖం, పాలభాగం, ఊర్ధ్వపుండ్రం, చెవులు, వాటికి ఆభరణాలైన కుండలాలు, కనుబొమలు, నేత్రాలు, కటాక్షాలు, నాసిక, అధరం, కంఠం, బాహువులు, వాటిలోని శంఖచక్రాలు, అభయహస్తం, వక్షస్సు, వనమాల, మనస్సు, నడుము, ఉదరం, మొలనూలు, నాభి, ఊరువులు, ముంగాళ్ళు, పిక్కలు, పాదాలు, కాలివే  , కాలి గోళ్ళు, పాదరజస్సు –అనే వీనిని వర్ణించారు. తరువాత భక్తియోగాని కంటే ప్రపత్తికి ఉండే గొప్పదనాన్ని తెలిపి, శరణు పొందిన తమను రక్షించమని అర్థించి, తామే దేవనాయకుని కరుణకు తగిన పాత్రమని, మిగిలినవారిని రక్షించడం కంటే తమను రక్షించడమే ముఖ్యమని పలికి, తమను తన పాదసన్నిధిలో చేర్చుకొనమని వేడి సంసార తాపాన్ని తీర్చమని అర్థించి, తిరువహీంద్ర పురంలో నిత్యవాసాన్ని అర్థించి, ఈ స్తుతిని ముగించారు.

పరమపదసోపానమనే రహస్యంలోని చివరి పర్వమైన ప్రపత్తిపర్వంలో దేశికులు శ్రీవైకుంఠంలోని పరమపదనాథుని ముక్తులు అనుభవించే క్రమాన్ని ఈ స్తుతినే ఇంచుమించుగా అనుసరిస్తూ పలికినందున. దేవనాయకస్వామి రూపమే ముక్తులకు అక్కడకూడా అనుభావ్యమనేది దేశికుల అభిప్రాయమనే విషయం వ్యక్తమవుతున్నది– అని పెద్దలంటారు.



# దేవనాయకపంచాశత్

1)ప్రణతసురకిరీట ప్రాన్తమన్దారమాలా
విగలిత మకరన్దస్నిగ్ధపాదారవిన్దః 1
పశుపతివిధిపూజ్యః పద్మపత్రాయతాక్షః
ఫణిపతిపురనాథః పాతు మాం దేవనాథః ॥

దేవనాయకస్వామిని నమస్కరించే దేవతలు తమ కిరీటాలలో అలంకరించుకొన్న మందారపూలనుండి స్రవించే తేనె ఆ స్వామి పాదపద్మాలను తడపుతున్నది. శివుడు, బ్రహ్మ అ స్వామిని పూజిస్తున్నారు. అతని నేత్రాలు తామరపూల రేకులవలె విశాలంగా ఉన్నాయి. తిరువహీంద్ర పురనాథుడైన ఆ భగవానుడు నన్ను కాపాడాలి.

2)దేవాధినాథ కమలాపృతనేశపూర్వాం
దీప్తాన్తరాం వకులభూషణనాథముఖ్యైః 1
రామానుజప్రభృతిభిః పరిభూషితాగ్రాం
గోప్త్రీం జగన్తి గురుపఙ్క్తి మహం ప్రపద్యే॥

దేవనాయకుడు(భగవానుడు), లక్ష్మీదేవి, విష్వక్సేనుడు –అనే వీరిని ప్రారంభంలో కలిగినది, వకుళాభరణులైన నమ్మాళ్వార్, నాథముని మొదలైనవారిని నడుమ కలిగినది, శ్రీభాష్యకారులు మొదలైనవారివల్ల చివర అందంగా ఉన్నది, లోకాలను కాపాడేది అయిన ఆచార్యపరంపరను నేను శరణు పొందుతున్నాను.

3)దివ్యే దయాజలనిధౌ దివిషన్నియన్తుః
తీర్థం నిదర్శితవత స్త్రిజగన్నిషేవ్యమ్ 1

ప్రాచః కవీన్ నిగమసమ్మితసూనృతోక్తీన్
ప్రాచేతస ప్రభృతికాన్ ప్రణమామ్యభీక్ష్ణమ్ ||

దేవనాయకుని గొప్ప కరుణ అనే కడలిలో మూడు లోకాలకు సేవించదగిన (స్నానమాడదగిన). తీర్థాన్ని(రేవును) చూపించినవారు, వేదాలవలె కీర్తించదగిన, సత్యమైన, ప్రియమైన సూక్తులను పలికేవారు, ప్రాచీనకవులైన వాల్మీకి మొదలైనవారిని సదా నమస్కరిస్తాను.,

4)మాత స్త్వ మమ్బురుహవాసిని కిఞ్చిదేత
ద్విజ్ఞాప్యతే మయి కురుష్వ తథా ప్రసాదమ్ 1
ఆకర్ణయిష్యతి యథా విబుధేశ్వరస్తే
ప్రేయా నసౌ పృథుకజల్పితవన్మదుక్తిమ్.

తామరపూవులో నివసించే తల్లీ! ఈ చిన్న విషయాన్ని విన్నపిస్తున్నాను. నీ ప్రేమకు లక్ష్యభూతుడైన దేవనాయకస్వామి నా మాటను, బాలుడు పలికే ముద్దుమాటలనువలె, వినేటట్లుగా నీవు నా విషయంలో అనుగ్రహించు. (నా మాటలను ముందు నీవు విను)

5)నిర్విశ్యమానవిభవం నిగమోత్తమాఙ్గైః
స్తోతుం క్షమం మమ చ దేవపతే భవన్తమ్ 1
గావః పిబన్తు గణశః కలశామ్బురాశిం
కిం తేన తర్ణకగణా స్తృణ మాదదానాః||

దేవనాయకస్వామీ! ఉపనిషత్తులు కీర్తించే వైభవాన్ని కల నిన్ను స్తుతించడానికి నాకుకూడా యోగ్యత ఉన్నది. గోవులు గుంపులు గుంపులుగా

పాలసముద్రాన్ని తాగనీ, కాని, లేగదూడల గుంపులు తృణమాత్రంగా కొంచెం పాలు తాగడంలో ఏమి నష్టం ?

6)అజ్ఞాతసీమక మనన్తగరుత్మదాద్యై
స్తం త్వాం సమాధినియతై రపి సామి దృష్టమ్ ।
తుష్టూషతో మమ మనోరథ సిద్ధిదాయీ
దాసేషు సత్య ఇతి ధారయ నామధేయమ్||

ఆదిశేషుడు, గరుడుడు మొదలైనవారుకూడా తెలియలేని మహిమను కలవాడవు, భక్తియోగాన్ని అనుష్ఠించేవారికికూడా అల్పమే దర్శించడానికి సాధ్యమైనవాడవైన నిన్ను స్తుతించదలచే నా కోరికను పూర్తి చేసేవాడవై, భక్తుల విషయంలో సత్యస్వరూపుడవనే నీ పేరును నిలబెట్టుకో.

7)విశ్రాణయన్ మమవిశేష విదామనిన్ద్యా
మన్తర్వతీం గిరిమహీన్ద్ర పురాధిరాజ ।
స్తవ్యః స్తవప్రియ ఇతీవ తపోధనోక్తం
స్తోతేతి చ త్వదభిధాన మవన్ధ్యయ త్వమ్ ॥

తిరువహీంద్రపురంలోని స్వామీ! నీవు విశేషమైన జ్ఞానాన్ని కలవారు పొగడదగిన, గొప్ప అర్థాలను కల వాక్కును నాకు అనుగ్రహించి, "స్తవ్యః" (స్తుతించదగినవాడు), "స్తవప్రియః"(స్తుతిని ఇష్టపడేవాడు)అని, "స్తోతా" (తనను స్తుతించేవారిని పొగిడేవాడు) అని వ్యాసమహర్షి సహస్రనామస్తోత్రంలో నిన్నుగూర్చి పలికిన నీ నామాలను సార్థకం చేసికో

.

8)సంరక్షణీయ మమరాధిపతే త్వయైవ
దూరం ప్రయాతమపి దుస్త్యజగాఢబన్ధమ్ ।
ఆకృష్టవానసి భవాననుకమ్పమానః
సూత్రానుబద్ధశకునిక్రమత స్స్వయం మామ్ ॥

దైవనాయకస్వామీ! విడువడానికి సాధ్యం కాని, గాఢమైన సంసారబంధాన్ని నీతో కలవాడనై, నీచేతనే రక్షింపదగినవాడనైన నేను, నీకు చాలా దూరంగా తొలగిపోయినా, నాపై దయగలవాడవై, దారంతో కట్టి విడచిన పక్షినివలె స్వయంగా నీవే నీ దగ్గరకు ఆకర్షించుకొన్నావు.

9)వ్యామోహితా వివిధ భోగమరీచికాభిః
విశ్రాన్తి మద్య లభతే విబుధైకనాథ ।
గమ్భీరపూర్ణమధురం మమధీ ర్భవన్తం
గ్రీష్మే తటాకమివ శీత మనుప్రవిష్టా ॥

దేవనాయకా! పలు విధాలైన సుఖానుభవాలనే ఎండమావులలో వ్యామోహాన్ని పొందిన నా బుద్ధి గొప్పవాడవు గుణాలతో నిండైనవాడవు, భోగ్యుడవు, చల్లనివాడవు అయిన నిన్ను, గ్రీష్మకాలంలో చల్లని తటాకాన్నివలె, ప్రవేశించి, ఇపుడు విశ్రాంతిని పొందుతున్నది.

10)దివ్యే పదే జలనిధౌ నిగమోత్తమాఙ్గే
స్వాన్తే సతాం సవితృమణ్డలమధ్యభాగే ।
బ్రాహ్మేచలే చ బహుమానపదే మునీనాం
వ్యక్తిం తవ త్రిదశనాథ! వదన్తి నిత్యామ్ ॥

దైవనాయకస్వామీ! శ్రీవైకుంఠంలో, క్షీరాబ్ధిలో, వేదాంతాలలో, మహాత్ముల మనసులలో, సూర్యమండలంలోని మధ్యభాగంలో, మునివరులు గౌరవించే ఈ బ్రహ్మాచలమనే ఈ క్షేత్రంలో నీ ఆవిర్భావం (సన్నిధానం) నిత్యమని పెద్దలంటారు.

11)తీర్థైర్వృతం వృజినదుర్గతినాశనార్హైః
శేష క్షమా విహగరాజ విరిఞ్చి జుష్టైః ।
నాథ! త్వయా నతజనస్య భవౌషధేన
ప్రఖ్యాతమౌషధగిరిం ప్రణమన్తి దేవాః ॥

దేవనాయకస్వామీ! పాపాన్ని, దుర్గతిని నశింపజేయగలిగిన, ఆదిశేషునిచే, భూదేవిచే, గరుడునిచే, బ్రహ్మచే పొందబడిన (ఏర్పడిన) శేషతీర్థం, భూమితీర్థం, గరుడతీర్థం, బ్రహ్మతీర్థం –అనే పుణ్యతీర్థాలను కలిగినది, సేవించినవారికి సంసారౌషధంవంటివాడవైన నీ సన్నిధానంవలన కీర్తింబడేది అయిన ఔషధాద్రిని దేవతలు నమస్కరిస్తున్నారు.

12)స్వాధీన విశ్వ విభవం భగవన్విశేషా
త్త్వాం దేవనాయక ముశన్తి పరావరజ్ఞాః ।
ప్రాయః ప్రదర్శయితు మేతదితి ప్రతీమః
త్వద్భక్తిభూషితధియా మిహ దేవభావమ్ ॥

దేవనాయకస్వామీ! బ్రహ్మజ్ఞానులు విశ్వమనే సంపదను అధీనంలో కల నిన్ను దేవనాయకుడవని పిలుస్తున్నారు. ఈ విధంగా పల్కడం ఎందుకంటే–ఈ దివ్యదేశంలో నీపట్ల ఉండే భక్తితో భూషింపబడిన మనస్సును కలవారికి (నీ

విషయంలో భక్తిని కలవారికి) దైవత్వం కలుగుతుందనే విషయాన్ని తెలుపడంకోసమే –అని భావిస్తాము.

13)తత్త్వాని యాని చిదచిత్ప్రవిభాగవన్తి
త్రయ్యన్తవృద్ధగణితాని సితాసితాని I
దీవ్యన్తి తాన్యహిపురన్దరధామనాథ!
దివ్యాస్త్ర భూషణతయా తవ విగ్రహేऽస్మిన్ ॥

తిరువహీంద్రపురంలో వేంచేసి ఉండే స్వామీ! చేతనాచేతనవిభాగాన్ని కలిగినవి, స్వయంప్రకాశమైనవి, జడమై ఉండేవి అయిన తత్త్వాలు వేదాంతంలో తల పండిన జ్ఞానాన్ని కలవారిచే లెక్కించబడ్డాయి, అవి అన్నీ, నీ ఈ మేనిలో దివ్యాయుధాలుగా, దివ్యాభరణాలుగా ప్రకాశిస్తున్నాయి

14)భూషాయుధై రధిగతం నిజకాన్తి హేతోః
భుక్తం ప్రియాభి రనిమేషవిలోచనాభిః I
ప్రత్యఙ్గపూర్ణ సుషమా సుభగం వపు స్తే
దృష్ట్వా దృశౌ విబుధనాథ! న తృప్యతో మే ॥

దేవనాయకస్వామీ! ప్రతి దివ్యాంగంలోను పూర్ణంగా ప్రకాశించే గొప్ప అందంతో భోగ్యమై ఉండేది, తాము కాంతిని పొందడంకోసం దివ్యాభరణాలచే, దివ్యాయుధాలచే పొందబడినది (దివ్యాభరణాలకు, దివ్యాయుధాలకు శోభను కలిగించేది), దివ్యదేవేరులచే రెప్పపాటు వేయకుండా దర్శింపబడేదైన నీ తిరుమేనిని సేవించి, నా కన్నులు ఎప్పటికీ తృప్తిని పొందడం లేదు.

15)వేదేషు నిర్జరపతే! నిఖిలేష్వధీతం
వ్యాసాదిభి ర్బహుమతం తవ సూక్త మగ్ర్యమ్ ।
అఙ్గాన్యమూని భవత స్సుభగాన్యధీతే
విశ్వం విభో! జనితవన్తి విరిఞ్చపూర్వమ్ ॥

జగత్తులో అంతటా వ్యాపించి ఉండే దేవనాయకస్వామీ! వేదాలన్నిటిలో అధ్యయనం చేయబడేది, వ్యాసాదులచే మిక్కిలి గౌరవింపబడినది, గొప్పదైన నీ (పురుష)సూక్తం నీ అందమైన ఈ అవయవాలు బ్రహ్మ మొదలైన ఈ లోకాన్ని జనింపజేశాయి —అని పలుకుతున్నది.

16)దేవేశ్వరత్వ మిహ దర్శయితుం క్షమస్తే
నాథ! త్వయా ఽ పి శిరసా విధృతః కిరీటః ।
ఏకీకృత ద్యుమణిబిమ్బసహస్ర దీప్తిః
నిర్మూలయన్మనసి మే నిబిడం తమిస్రమ్ ॥

దేవనాయకస్వామీ! ఒకటిగా అయిన వేయి సూర్యబింబాల ప్రకాశాన్ని కలిగిన, నా మనస్సులో పేరుకుపోయిన అజ్ఞానమనే చీకటిని పూర్తిగా పోగొట్టే, నీవు శిరస్సులో ధరించిన కిరీటం ఈ లోకంలోని దేవతలందరికి నీవు నాయకుడై ఉండడాన్ని తెలుపగలిగినదై ఉన్నది.

17)ముగ్ధస్మితామృతశుభేన ముఖేన్దునా తే
సఙ్గమ్య సంసరణసంజ్వర శాన్తయే నః ॥
సమ్పద్యతే విబుధనాథ! సమాధియోగ్యా
శర్వర్యసౌ కుటిలకున్తలకాన్తిరూపా ॥

దేవనాయకస్వామీ! అందమైన మందహాసమనే అమృతంతో అందంగా ఉండే నీ ముఖమనే చంద్రునితో కుటిలమైన కేశపాశంయొక్క కాంతి అనే రాత్రి కలసి ధ్యానానికి తగినదై, మా సంసారమనే క్రూరమైన జ్వరాన్ని తీర్చడానికి సమర్థమై ఉన్నది.

18)బిమ్బాధరం వికచపఙ్కజలోచనం తే
లమ్బాలకం లలితకుణ్డలదర్శనీయమ్ ।
కాన్తం ముఖం కనకకైతకకర్ణపూరం
స్వాన్తం విభూషయతి!దేవపతే! మదీయమ్ ॥

దేవనాయకస్వామీ! దొండపండువంటి అధరాన్ని కలిగినది, వికసించిన తామరలవంటి నేత్రాలను కలిగినది, వేలాడే కురులను కలిగినది, అందమైన కుండలాలతో దర్శిందగినది, బంగారంతో చేసిన మొగలి పూవును కర్ణాలంకారంగా కలిగినది, సుందరమైన నీ ముఖం నా మనస్సును అలంకరిస్తున్నది.

19)లబ్ధాతిథౌ క్వచిదియం రజనీకరేణ
లక్ష్మీః స్థిరా సురపతే! భవతో లలాటే ।
యత్స్వేదబిన్దు కణికోద్గత బుద్బుదాన్తః
త్ర్యక్షః పురా ఽ సా పురుషోఽజని శూలపాణిః ॥

దేవనాయకస్వామీ! నీ ఫాలంలోని స్వేదబిందుకణాలనుండి పుట్టిన బుడగల మధ్యనుండి త్రినేత్రుడై, శూలాన్ని చేతిలో ధరించిన ఆ శివుడు సృష్టికాలంలో పుట్టాడు, నీ ఆ ఫాలభాగంలో అష్టమీతిథిలోని చంద్రుని అందం ప్రకాశిస్తున్నది.

20)లావణ్యవర్షిణి లలాటతటే ఘనాభే
బిభ్రత్తటిద్గుణ విశేషమివోర్ధ్వపుణ్డ్రమ్ ।
విశ్వస్య నిర్జరపతే! తమసావృతస్య
మన్యే విభావయసి మాఙ్గలిక ప్రదీపమ్ ॥

దేవనాయకస్వామీ! మేఘంవలె ప్రకాశించేది, లావణ్యాన్ని వర్షించేది అయిన నీ లలాటభాగంలో అద్భుతమైన మెరపుతీగవంటి ఊర్ధ్వపుండ్రాన్ని ధరించడంద్వారా నీవు అజ్ఞానాంధకారంతో ఆవరింపబడిన లోకానికి మంగళదీపాన్ని వెలిగిస్తున్నావని భావిస్తున్నాను.

21)ఆహుః శ్రుతిం విబుధనాయక! తావకీనా
మాశాగణప్రసవహేతు మధీతవేదాః ।
ఆకర్ణితే తదియ మార్తరవే ప్రజానామ్
ఆశాః ప్రసాధయితు మాదిశతి స్వయం త్వామ్ ॥

దేవనాయకస్వామీ! వేదాన్ని అధ్యయనం చేసినవారు నీ చెవిని దిక్సమూహంయొక్క జన్మకు కారణంగా పలుకుతున్నారు. ఈ చెవి, జనుల ఆర్తనాదాన్ని విన్నపుడు వారి మనోరథాలను సఫలం. చేయడానికి స్వయంగా నిన్ను ప్రేరేపిస్తున్నది

22)కన్దర్పలాఞ్ఛనతను స్త్రిదశైకనాథ!
కాన్తి ప్రవాహరుచిరే తవ కర్ణపాశే ।
పుష్యత్యసౌ ప్రతిముఖస్థితి దర్శనీయా
భూషామయీ మకరికా వివిధాన్విహారాన్ ॥

దేవతలకు సాటి లేని నాయకుడవైన స్వామీ! మన్మథునకు ధ్వజమైన చేపయొక్క రూపాన్ని ధరించినది, నీ ముఖానికి ఎదురుగా ఉన్నందున (ప్రవాహానికి ఎదురుగా వెళ్ళే స్థితిలో ఉన్నందున )చూచేవారికి మనోహరమై, దివ్యాభరణమై ఉండే ఈ మకరకుండలం కాంతిప్రవాహంతో అందమైన నీ చెవిలో పలు విధాలైన విహారాలను వృద్ధి చేస్తున్నది. (మిక్కిలిగా కలిగి ఉన్నది. )

23)నేతుం సరోజవసతి ర్నిజ మాధిరాజ్యం
నిత్యం నిశామయతి దేవపతే భ్రువౌ తే ।
ఏవం న చేదఖిలజన్తువిమోహనార్హా
కిం మాతృకా భవతి కామ శరాసనస్య ॥

దేవనాయకస్వామీ! నాభీకమలంలో ఉండే బ్రహ్మ సృష్టించడమనే తన అధికారాన్ని నిర్వహించడానికి సదా నీ కనుబొమల కదలికలను గమనిస్తూ ఉంటాడు. లేకపోతే, ప్రాణులనందరిని మోహింప జేయుగల మన్మథుని వింటికి ఇది ఏవిధంగా మాతృకగా అవుతుంది ?(నీ కనుబొమలను చూచి బ్రహ్మ లోకాన్ని వ్యామోహపరచే మన్మథుని వింటిని సృష్టించాడు. )

24)ఆలక్ష్యసత్త్వ మతివేలదయోత్తరఙ్గ
మభ్యర్థినా మభిమతప్రతిపాదనార్హమ్ ।
స్నిగ్ధాయతం ప్రథిమశాలి సుపర్వనాథ!
దుగ్ధామ్బుధే రనుకరోతి విలోచనం తే ॥

దేవనాయకస్వామీ! పూర్తిగా వ్యక్తమయే సత్త్వగుణాన్ని కలిగినది (జలప్రాణులతో నిండి ఉన్నది) తీరాన్ని దాటిన కరుణాతరంగాలను కలిగినది,

కోరేవారికి వారు కోరినవానిని ఇవ్వగలిగినది, (స్నేహాన్ని కలిగినది)అందమైనది, విస్తృతమైనది. పొడుగైనది అయిన నీ నేత్రం పాలకడలితో పోలి ఉన్నది.

25)విశ్వాభిరక్షణవిహారకృతక్షణై స్తే
వైమానికాధిప! విడమ్బిత ముగ్ధపద్మైః ।
ఆమోదవాహిభి రనామయవాక్యగర్భైః
ఆర్ద్రీభవామ్యమృతవర్షనిభై రపాఙ్గైః ॥

విమానాలలో పయనించే దేవతలకు ప్రభూ! లోకాన్ని రక్షించడమనే విహారాన్ని( లీలను ) చేయడంలో ఉత్సాహాన్ని కలిగినవి, అందమైన తామరపూలవంటివి, ఆమోదాన్ని(సుగంధాన్ని, పరిమళాన్ని) కలిగినవి, క్షేమాన్ని అడిగే వాక్యాలను లోపల ఇముడ్చుకొన్నవి, అమృతవర్షంవలె ఉన్నవి అయిన నీ కడగంటి చూపులతో (కటాక్షాలతో)తాపం తీరినవాడనై చల్లబడుతున్నాను.

26)నిత్యోదితై ర్నిగమనిశ్శ్వసితై స్తవైషా
నాసా నభశ్చరపతే! నయనాబ్ధిసేతుః ।
ఆమ్రేడిత ప్రియతమా ముఖపద్మగన్ధై
రాశ్వాసినీ భవతి సమ్ప్రతి ముహ్యతో మే ॥

ఆకాశంలో సంచరించే దేవతలకు ప్రభూ! సదా ఉదయయించేవి, దేవేరుల ముఖారవిందాల పరిమళాన్ని పలు రెట్లు వృద్ధి చేసేవి అయిన వేదరూపాలనే నిఃశ్వాసాలతో నీ నేత్రమనే సముద్రానికి వారధివంటి నీ ఈ నాసిక (ముక్కు) ఇపుడు సంసారంలో మోహాన్ని పొందే నాకు శ్రమ పోగొడుతున్నది

27)ఆరుణ్యపల్లవిత యౌవనపారిజాత
మాభీరయోషిదనుభూత మమర్త్యనాథ 1
వంశేన శఙ్ఖపతినా చ నిషేవితం తే
బిమ్బాధరం స్పృశతి రాగవతీ మతి ర్మే ॥

దేవనాయకస్వామీ! ఎఱ్ఱగా చిగురించిన యౌవనమనే పారిజాతవృక్షాన్ని కలిగిది, గొల్ల పడుచులచే అనుభవింపబడినది, పిల్లనగ్రోవిచే, పాంచజన్యశంఖంచే మాటిమాటికి సేవింపబడినది అయిన దొండపండువంటి నీ అధరాన్ని నీపట్ల అనురాగాన్ని (భక్తిని) కల నా బుద్ధి అనేకాంత ) స్పృశిస్తున్నది.

28)పద్మాలయావలయదత్తసుజాతరేఖే
త్వత్కాన్తి మేచకితశఙ్ఖనిభే మతి ర్మే 1
విస్మేరభావరుచిరా వనమాలికేవ
కణ్ఠే గుణీభవతి దేవపతే! త్వదీయే ॥

దేవనాయకస్వామీ! తామరపూవును నివాసంగా కల లక్ష్మి ధరించిన చేతి గాజులవల్ల ఏర్పడిన అందమైన రేఖలను కలిగినది, నీ కాంతితో. నల్లగా చేయబడిన శంఖంవలె ఉండే నీ పాంచజన్యశంఖంలో నా బుద్ధి, వికసించిన పూలతో కూర్చుడంవల్ల అందంగా ఉండే వనమాలవలె, గుణాన్ని(దారాన్ని, ప్రీతిని)పొందుతున్నది.

29)ఆజానులమ్బిభి రలఙ్కృత హేతిజాలై
ర్జ్యాఘాతరాజిరుచిరై ర్జితపారిజాతైః 1
చిత్రాఙ్గదై స్త్రిదశపుఙ్గవజాతసఙ్గా
త్వద్బాహుభి ర్మమ దృఢం పరిరభ్యతే ధీః ॥

దేవనాయకస్వామీ! మోకాళ్ళవరకు పొడుగుగా ఉన్నవి, ఆయుధసమూహాలకు అందాన్ని ఇచ్చేవి, అల్లెతాడు దెబ్బలవల్ల ఏర్పడిన కాయలతో (కిణాలచే) అందంగా ఉన్నవి, పారిజాత వృక్షాన్నికూడా జయించేవి, విచిత్రమైన వలయాలను కలిగినవి అయిన నీ భుజాలతో సంబంధాన్ని పొందిన నా బుద్ధి వాటిని బిగువుగా ఆలింగనం చేసికొంటున్నది. (దర్శించి ఆనందిస్తున్నది)

30)నీలాచలోదిత నిశాకర భాస్కరాభే
శాన్తాహితే సురపతే! తవ శఙ్ఖచక్రే 1
పాణే రముష్య భజతా మభయప్రదస్య
ప్రత్యాయనం జగతి భావయత స్స్వభూమ్నా ॥

దేవనాయకస్వామీ! ఇంద్రనీలపర్వతంపై ఉదయించిన చంద్రునివలె, సూర్యునివలె ఉన్నవి, శత్రువులను నిర్జించేవి అయిన నీ ఆయుధాలైన శంఖచక్రాలు నిన్ను శరణు పొందినవారికి నీవు నీ కుడి చేతిలోని అభయముద్రతో ఇచ్చే అభయంలో నమ్మికను లోకంలో తమ శక్తితో కలిగిస్తున్నాయి.

31)అక్షోభణీయకరుణామ్బుధి విద్రుమాభం
భక్తానురఞ్జన మమర్త్యపతే! త్వదీయమ్ 1
నిత్యాపరాధచకితే హృదయే మదీయే
దత్తాభయం స్ఫురతి దక్షిణపాణిపద్మమ్ ॥

దేవనాయకస్వామీ! కలతను (క్షోభను) పొందించడానికి వీలు కాని కరుణాసముద్రంలోని పగడంవంటిది, భక్తులను ఆనందింజేసేది అయిన

తామరపూవువంటి నీ కుడి చేయి ఎల్లప్పుడు పాపం చేయడంవల్ల భయపడిన నా మనస్సులో అభయాన్ని ప్రసాదిస్తూ ప్రకాశిస్తున్నది.

32)దుర్దాన్తదైత్యవిశిఖక్షతపత్రభఙ్గం
వీరస్య తే విబుధనాయక! బాహుమధ్యమ్ ।
శ్రీవత్సకౌస్తుభరమావనమాలికాఙ్కం
చిన్తాఽనుభూయ లభతే చరితార్థతాం నః ॥

దేవనాయకా! దుష్టులైన అసురులు నీపై ప్రయోగించిన బాణాల దెబ్బలవల్ల నీ వక్షస్సులో ఏర్పడిన పలు విధాలైన గాయాల గుర్తులే పత్రభంగాలుగా( అలంకారంగా వ్రాసిన వర్ణచిత్రాలుగా) ప్రకాశిస్తున్నాయి. శ్రీవత్సమనే పుట్టుమచ్చ, ఎర్రని కౌస్తుభరత్నం, లక్ష్మి, వనమాల –అనే వీనిని చిహ్నాలుగా కల వీరుడవైన నీ వక్షఃస్థలాన్ని మా మనస్సు దర్శించి, కృతార్థమవుతున్నది.

33)వర్ణక్రమేణ విబుధేశ విచిత్రితాఙ్గీ
స్మేరప్రసూనసుభగా వనమాలికేయమ్ ।
హృద్యా సుగన్ధిరజహత్కమలామణీన్ద్రా
నిత్యా తవ స్ఫురతి మూర్తి రివ ద్వితీయా ॥

దేవనాయకస్వామీ! వర్ణాల క్రమంతో (జాతుల క్రమంతో) పలు రంగులను కల రూపాన్ని కలిగినది (పలు అవయవాలను కలిగినది), వికసించిన పూలతో అందమైనది ( వికసించిన పూవువలె అందమైనది ), వక్షఃస్థలంలో అలంకరింపబడినది (అందమైనది), సుగంధాన్ని కలిగినది, లక్ష్మీదేవిని,

కౌస్తుభరత్నాన్ని విడచి ఉండనిది, నిత్యమైనది అయిన ఈ వనమాల నీ రెండవ తిరుమేనివలె వెలుగుతున్నది.

34)ఆర్ద్రం తమోమథన మాశ్రితతారకం తే
శుద్ధం మనః సుమనసా మమృతం దుహానమ్1
తత్తాదృశం విబుధనాథ! సమృద్ధకామం
సర్గేష్విదం భవతి చన్ద్రమసాం ప్రసూతిః ॥

దేవనాయకస్వామీ! కరుణవల్ల ఆర్ద్రమై, (చల్లనిదై), అజ్ఞానాన్ని పోగొట్టేదై (చీకటిని పోగొట్టేదై), భక్తులను తరింపజేసేదై (నక్షత్రాలచే ఆశ్రయింపబడినదై)పవిత్రమై(తెల్లనిదై), మంచి మనస్సు కలవారికి (దేవతలకు) మోక్షాన్ని(అమృతాన్ని)ఇచ్చేదై, కోరికలతో నిండినదై(అనురాగాన్ని వృద్ధి చేసేదై), అద్భుతమైన నీ మనస్సు సృష్టికాలంలో చంద్రుని సృష్టికి కారణమవుతున్నది.

35)విశ్వం నిగీర్య విబుధేశ్వర! జాతకార్శ్యం
మధ్యం వలిత్రయవిభావ్య జగద్విభాగమ్ 1
ఆమోది నాభినలినస్థ విరిఞ్చ భృఙ్గ–
మాకల్పయత్యుదరబన్ధ ఇవాశయో మే ॥

దేవనాయకా! సమస్తజగత్తును ఆరగించినా ఇంకా చాలా కృశించి ఉన్నది, మూడు మడుపుల రూపంలో మూడు లోకాల విభాగాన్ని కలిగినది, పరిమళాన్ని కల నాభీపద్మంలో ఉండే తుమ్మెదవంటి బ్రహ్మను కలిగినది అయిన నీ మధ్యభాగాన్ని(నడుమును) నా మనస్సు ఉదరబంధం (వడ్డాణం)వలె అలంకరిస్తున్నది.

36)నాకౌకసాం ప్రథమతామధికుర్వతే తే
నాభీసరోజరజసాం పరిణామభేదాః ।
ఆరాధయద్భి రిహ తై ర్భవత స్సమీచీ
వీరోచితా విబుధనాయక! ఇత్యభిఖ్యా ॥

వీరా! నీ నాభికమలంలోని పుప్పొడియొక్క పరిణామభేదాలే దేవతలలోని ప్రథమస్థానాన్ని పొందుతున్నవి. (బ్రహ్మాదిదేవతాప్రముఖులవుతున్నారు)తమకు కలిగిన ఆపదలను తీర్చే నిన్ను ఆ దేవతలందరు ఈ క్షేత్రంలో ఆరాధిస్తున్నారు. అందువల్ల నీకు దేవనాయకుడనే పేరు తగినదే.

37)పీతామ్బరేణ పరివారవతీ సుజాతా
దాస్యే నివేశయతి దేవపతే! దృశౌ మే ।
విన్యస్త నవ్యకరసఙ్గమ జాయమాన
రోమాఞ్చరమ్యకిరణా రశనా త్వదీయా ॥

దేవపతీ! పీతాంబరంతో చుట్టబడినది (పరివారాలను కలిగినది), అందమైనది (మంచి పుట్టుకను కలిగినది), తొడపై పెట్టుకొన్న ఎడమ చేతిసంబంధంచేత రోమాంచాన్ని పొందినదా! అనేటట్లుండే అందమైన కిరణాలను కలిగినదైన నీ నీ మొలనూలు నా కన్నులను నీ దాస్యంలో ప్రవేశపెడుతున్నది(సదా నా కన్నులు నీ మొలనూలును దర్శించి, ఆనందిస్తున్నవి).

38)స్త్రీరత్నకారణ ముపాత్తతృతీయవర్ణం
దైత్యేన్ద్రవీరశయనం దయితోపధానమ్ ।
దేవేశ! యౌవన గజేన్ద్ర కరాభిరామ
మూరూకరోతి భవదూరుయుగం మనో మే ॥

దేవనాయకస్వామీ! ఊర్వశి అనే స్త్రీరత్నాన్ని సృష్టించినవి, మూడవ వర్ణమైన వైశ్యజాతిని సృష్టించినవి, అసురవీరులకు వీరశయనమైనవి, దేవేరులకు తలదిండు అయినవి, యౌవనమనే గొప్ప ఏనుగు తొండంవలె అందమైనవి అయిన నీ ఊరువులు (తొడలు) నా మనసును తమ వశం చేసికొంటున్నవి.

39)లావణ్య పూర లలితోర్ధ్వపరిభ్రమాభం
లక్ష్మీవిహార మణిదర్పణబద్ధసఖ్యమ్ ।
గోపాఙ్గణేషు కృతచఙ్క్రమణం తవైత–
జ్జానుద్వయం సురపతే! న జహాతి చిత్తమ్ ॥

దేవనాయకస్వామీ! లావణ్యప్రవాహంలో పైన కన్పించే అందమైన సుడివంటిది, లక్ష్మీదేవి లీలకోసమైన రత్నపుటద్దంవంటిది, గోపాలుర ఇంటి ముంగిటిలో తిరుగాడినవి అయిన నీ ఈ రెండు జానువులు (మోకాళ్ళు) నా మనస్సును విడువడంలేదు.

40)దూత్యే దుకూల హరణే వ్రజసున్దరీణా
దైత్యానుధావనవిధావపి లబ్ధసాహ్యమ్ ।
కన్దర్పకాహలనిషఙ్గకలాచికాభం
జఙ్ఘాయుగం జయతి దేవపతే! త్వదీయమ్ ॥

దేవనాయకస్వామీ! నీవు పాండవుల దూతగా వెళ్ళడంలో, గొల్లపిల్లల వస్త్రాలను దొంగిలించడంలో, దైత్యులను తరిమికొట్టడంలో నీకు సహాయడేవి, మన్మథుని కాహళమనే(బాకా)వాద్యంవలె, అతని అంబులపొదివలె, కాలాంచి అనే పాత్రవలె ప్రకాశించేవి అయిన నీ రెండు కాలిపిక్కలు గొప్పగా ప్రకాశిస్తున్నాయి.

41)పాషాణ నిర్మిత తపోధన ధర్మదారం
భస్మన్యపాహిత నరేన్ద్రకుమారభావమ్|
సంవాహితం త్రిదశనాథ! రమామహీభ్యాం
సామాన్యదైవత ముశన్తి పదం త్వదీయమ్ ॥

దేవనాయకస్వామీ! రాతిలో గౌతమధర్మపత్ని అయిన అహల్యను సృష్టించినది, భస్మంనుండి రాజపుత్రుని (పరీక్షిత్ ను) సృష్టించినది, లక్ష్మీదేవిచే, భూదేవిచే సంవాహనం చేయబడేది అయిన నీ పాదాన్ని జగత్తు అంతా సామాన్యదైవంగా (అందరు సేవించదగిన దైవంగా)భావిస్తున్నది.

42)ఆవర్జితాభి రనుషజ్య నిజాంశుజాలై
ర్దేవేశ! దివ్యపదపద్మదలాయితాభిః ।
అన్యాభిలాషపరిలోల మిదం మదీయ
మజ్గీకృతం హృదయ మజ్గులిభి స్స్వయం తే ॥

దేవనాయకస్వామీ! నీకంటే వేరయిన కోరికలలో సంగాన్ని కలిగి చంచలమై, క్లేశపడే నా ఈ మనస్సు ను, తమ కాంతిసమూహాలన్నీ ఒకటిగా కలసినందున వాటి భారాన్ని మోయలేక కొంచెం వంగినవా! అనేటట్లు కొంచెం వంగి ఉన్నవి, అందమైన తామరపూవులోని రేకులవలె ఉండేవి అయిన నీ పాదాల వేళ్ళు స్వయంగా వశపరచుకొన్నవి.

43)పఙ్క్యాన్యసౌ మమ నిహన్తి మహా స్తరఙ్గైః
భంఙ్గాధికాం విదధతీ గరుడస్రవన్తీమ్ ।
నాకౌకసాం మణికిరీటగణై రుపాస్యా
నాథ! త్వదీయపదయో ర్నఖరత్నపఙ్క్తిః ॥

దేవనాయకస్వామీ! గరుడనదిని గంగానదిని కంటే గొప్పదిగా చేస్తున్నది, స్వర్గంలోని దేవతలచే తమ రత్నకిరీటాల సమూహాలతో నమస్కరింపబడేది అయిన నీ చరణాలలోని నఖాలనే మణుల వరుస కాంతితరంగాలతో నా పాపాలనే బురదను పోగొడుతున్నది.

44)వజ్రధ్వజాఙ్కుశ సుధా కలశాతపత్ర
కల్పద్రుమామ్బురుహతోరణ శఙ్ఖచక్రైః ।
మత్స్యాదిభిశ్చ విబుధేశ్వర! మణ్డితం తే
మాన్యం పదం భవతు మౌళివిభూషణం నః ॥

దేవనాయకస్వామీ! వజ్రాయుధం, ధ్వజం, అంకుశం, అమృతకలశం., ఛత్రం, కల్పవృక్షం, తామరపూవు, తోరణం, శంఖం, చక్రం అనే గుర్తులతోను, మత్స్యం మొదలైన చిహ్నాలతోను అలంకరింపబడినది, గౌరవించదగినది అయిన నీ చరణం నా శిరస్సుకు గొప్ప ఆభరణంగా కావాలి.

45)చిత్రం త్వదీయ పదపద్మ పరాగయోగాత్
యౌగం వినాపి యుగపద్విలయం ప్రయాన్తి ।
విష్వఞ్చి నిర్జరపతే! శిరసి ప్రజానాం
వేధః స్వహస్త లిఖితాని దురక్షరాణి ॥

దేవనాయకస్వామీ! ప్రజల నుదుటిపై బ్రహ్మచే తన చేతితో రాయబడి, అంతటా ఉండే రేఖలను తెలిపే అక్షరాలు యోగానుష్ఠానాన్ని చేయకుండానే, నీ చరణపద్మంలోని పరాగంచేత (పాదధూళిచేత) ఒకే సమయంలో చెరిగిపోతున్నాయి. ఎంత ఆశ్చర్యం!

46)యే జన్మకోటిభి రుపార్జితశుద్ధధర్మా
స్తేషాం భవచ్చరణభక్తి రతీవభోగ్యా 1
త్వజ్జీవితై స్త్రిదశనాయక! దుర్లభై స్తై
రాత్మాన మప్యకథయః స్వయ మాత్మవన్తమ్ ॥

దేవనాయకస్వామీ! ఎవరు, కోట్ల సంఖ్యలోని జన్మలలో యోగానికి కావలసిన ధర్మాలను సంపాదించారో, వారికి నీ చరణాలలో భక్తిని కలిగి ఉండడం భోగ్యంగా ఉంటుంది, నిన్నే పణంగా కలిగినవారు, పొందడానికి అరుదైనవారైన ఆ మహనీయులను నీవు నీకు ఆత్మగా గీతలో "జ్ఞానీ త్వాత్మైవ" అని అంటూ పలికావు.

47)నిష్కిఞ్చనత్వ ధనినా విబుధేశ! యేన
న్యస్తస్వరక్షణభర స్తవ పాదపద్మే 1
నానావిధప్రథితయోగ విశేషధన్యాః
నార్హన్తి తస్య శతకోటితమాంశకక్ష్యామ్ ॥

దేవనాయకస్వామీ! ఆకించన్యమే ధనంగా కల ఎవడు తన రక్షణభారాన్ని నీ పాదపద్మాలలో సమర్పించాడో, అతని గొప్పతనంలోని నూరుషకోట్ల భాగాలలో ఒక్క భాగాన్నికూడా నానావిధాలైన భక్తియోగాలను చేయడమనే భాగ్యాన్ని కలవారుకూడా పొందలేరు.

48)ఆత్మాపహారరసికేన మయైవ దత్త
మన్యై రధార్య మధునా విబుధైకనాథ! 1
స్వీకృత్య ధారితు మర్హసి మాం త్వదీయం
చోరోపనీతనిజనూపురవత్స్వపాదే ॥

దేవతలకు సాటి లేని నాయకుడా! తాను తనకు సొత్తు అని భావించడమనే ఆత్మాపహారంలో ఆసక్తిని కలవాడనైన నేను నన్ను ఇపుడు నీకు

సమర్పించుకొన్నాను. ఇతరులెవ్వరూ నన్ను రక్షించలేరు. నీవాడనైన నన్ను, దొంగ దొంగిలించి తిరిగి ఇచ్చిన నీ కాలి అందెనువలె, స్వీకరించి, నీ పాదంలో ధరించు.

49)అజ్ఞానవారిధి మపాయదురన్ధరం మామ్
ఆజ్ఞావిభఙ్గన మకిఞ్చనసార్వభౌమమ్ ॥
విన్దన్భవాన్విబుధనాథ! సమస్తవేదీ
కిం నామ పాత్ర మపరం మనుతే కృపాయాః ॥

దేవనాయకస్వామీ! అజ్ఞానానికి సముద్రంవంటివాడనై, పాపాలను చేయడంలో ముందుండేవాడనై, నీ ఆజ్ఞను అతిక్రమించేవాడనై, అకించనులలో మొదటివాడనైన నన్ను పొందిన తరువాతకూడా అన్నిటిని తెలిసిన నీవు నీ కరుణకు ఇంకొకనిని తగినవాడని ఎందుకు అనుకొంటున్నావు?,

50)ప్రహ్లాదగోకులగజేన్ద్రపరీక్షిదాద్యా
స్త్రాతా స్త్వయా నను విపత్తిషు తాదృశీషు ।
సర్వం తదేకమపరం మమ రక్షణం తే
సన్తోల్యతాం త్రిదశ నాయక! కిం గరీయః? ॥

దేవనాయకస్వామీ! ప్రహ్లాదుడు, పశువుల మంద, గజేంద్రుడు, పరీక్షిత్ మొదలైనవారిని చాలా పెద్ద ఆపదలలో నీవు రక్షించలేదా! అవి అన్నీ ఒక ఎత్తు, నన్ను రక్షించడం ఒక ఎత్తు. వీటిలో ఏది గొప్పదో తూచి చూడు.

51)వాత్యాశతై ర్విషయరాగతయా వివృత్తై
ర్వ్యాఘూర్ణమానమనసం విబుధాధిరాజ ।
నిత్యోపతప్త ఇతి మాం నిజకర్మఘర్మై
ర్నిర్వేశయ స్వపదపద్మమధుప్రవాహమ్ ॥

దేవనాయకస్వామీ! లౌకికవిషయాలలోని ఆశ అనే రూపాన్ని పొందిన వందలాది పెద్ద బలమైన గాలులచే, భ్రమించే మనస్సును కలవాడను, నా కర్మలనే వేడిమిచే సదా తపింపబడే నన్ను నీ పాదపద్మాలలోని తేనెవెల్లువను అనుభవించేటట్లుగా చేయాలి.

52) జయ విబుధపతే! త్వం దర్శితాభీష్టదానః
సహసరసిజవాసా మేదినీభ్యాం వశాభ్యామ్ ।
నలవన మివ మృద్గన్పాపరాశిం నతానాం
గరుడసరిదనూపే గన్ధహస్తీవ దీవ్యన్ ॥

దేవనాయకస్వామీ! నీవు (యథేచ్ఛగా మదజలాన్ని స్రవించే ) మదించిన గజంవలె కోరినదానిని ఇచ్చే నీ స్వభావాన్ని వ్యక్తం చేసేవాడవై, తామరవనాన్ని(సమూహాన్ని)వలె నిన్ను కొలిచేవారి పాపరాశిని నశింపజేస్తూ, గరుడనదీతీరంలో ఆడ ఏనుగులవంటి లక్ష్మీదేవి, భూదేవులతో ప్రకాశిస్తూ సర్వోత్కర్షతో వెలగాలి.

53)నిరవధి గుణజాతం నిత్యనిర్దోషమాద్యం
నరకమథనదక్షం నాకినా మేకనాథమ్ ।
వినతవిషయ సత్యం వేఙ్కటేశః కవి స్త్వాం
స్తుతిపదమధిగచ్ఛన్ శోభతే సత్యవాదీ ॥

వేంకటేశులనే కవి(వేదాంతదేశికులు) అంతు లేని గుణసమూహాన్ని కలవాడవు, ఏ విధమైన దోషం లేనివాడవు, జగత్తుకు మూలకారణం, నరకాన్ని పోగొట్టడంలో సమర్థుడవు, దేవతలకు సాటి లేని నాయకుడవు, శరణు పొందినవారి విషయంలో సత్యమైనవాడవైన నిన్ను స్తుతికి లక్ష్యంగా పొంది, ఉపనిషత్తులలో సత్యశబ్దంతో నిర్దేశింపబడిన నిన్ను కీర్తించి సత్యవాది అయ్యారు

దేవనాయకపంచాశత్ సంపూర్ణమ్

★★★★★★